# ఇఖ్బాల్ కవిత

(తెలుగు సేత)

11



డాక్టర్

బెజవాడ గోపాలరెడ్డి




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# 1. మిణుంగురు పురుగులు

తోటఇంటిలో కలదు మిణుగురు వెలుగు
పుష్పముల కవి సభలో దీపము వెలుగుచున్నదా ?
వచ్చెనా ఆకసమునుండి ఎగురుచు ఏదైన నక్షత్రము !
లేక ప్రాణము వచ్చెనా చంద్రుని కిరణాంశమునకు !
లేక రజనీ రాజ్యమునకు దివసంపుదూత అరుదెంచెనా
పరదేశమున ప్రకాశించెను, స్వస్థానమున కీర్తినొందక
లేక, ఉడుపతి ఉడుపులనుండి పేలిక ఉండ జారిపడెనా
లేక, సూర్యుని దుస్తులనుండి ఒకఅణువు ప్రకాశించు
చున్నదా !

దాగియుండిన ప్రాచీన సౌందర్యపు కాంతి బిందువా !
ప్రకృతి దానిని, ఏకాంతమునుండి సభలోనికి ఈడ్చెను
చిన్న చంద్రునిలో శుక్లకృష్ణపక్షముల కలయిక
ఇపుడు గ్రహణములో విడుపు, ఇపుడు గ్రహణములో పట్టు
శలభమునకు రెక్కలున్నవి, మిణుగురునకు రెక్కలు కలవు
అది వెలుగును వెదకుచుండును, ఇది ఒడలంతా వెలుగు

2

ప్రకృతి, పుడమిలో అన్నింటికి. హృదయమును ఆకర్షించు
శక్తినిచ్చెను.

శలభమునకు వెలుగుదప్పిక నిచ్చెను. 1488
మిణుగురునకు వెలుగునిచ్చెను.
భాషలేని పక్షులకు స్వనముల నొసగెను.
పువ్వులకు రెక్కలాలుకల నొసగి నిశ్శబ్దపాఠముల నేర్పెను.
సంధ్యారాగముల దృశ్యముల రమ్యత పతనము కొరకే
అ అప్సరసకు దీప్తినిచ్చి, అల్పాయువు నొసగెను
ప్రాతఃకాలమునకు వర్ణశోభల నిచ్చెను, పెండ్లి కూతురు రమ్య
ణీయ రూపమువలె
ఎర్రని దుస్తుల తొడగి మంచుఅద్దమును ఇచ్చెనా!
చెట్లకు నీడలను. తెమ్మెరలకు వీయుశక్తి నొసగెనా?
నీరములకు పారుదల, తరంగములకు చంచలత ప్రసాదించెను.
ఈ వ్యత్యాసములున్నవి. ఈ మాట నిజము
మిణుగురునకు ఏది దినమో, అదే మనకు రాత్రి.

## 3

సృష్టిసౌందర్యము అన్నివస్తువులలో ప్రకాశించి బహిర్గత
మగుచుండును.
మానవులలో అదిభాష, మొగ్గలలో వికసింప కోరిక
చంద్రుడు ఆకసమున కవిగుండెవలె నున్నాడు.
అచ్చట వెన్నెల కలదు, ఇచ్చట విరహవేదన
సంభాషణావైఖరి వంచించుచున్నది, లేకున్న
మధురగీతమే. శకుంతముల సౌరభము
పరిమళమే, ప్రసూనముల కూజితము

# 2. దాగ్[1]

గాలిబు గొప్పతనము
    కొంతకాలము మరుగుపడెను భూమిలో;
మహాది మజరూహ్[11]
    నివాసియాయెను నిశ్శబ్దనగరమున.
కూలనేసెను పరాయి ప్రాంతమున
    అమీర్ మీనాయిని[111] మృత్యువు.
సభా నేత్రమున ఇంతదనుక కలదు
    అమీరుని మదిరా మత్తత.
కాని, నేడు తోడి గాయకా
    తోట అంతయు దిగులుచెంది యున్నది.
కాంతిదీపము ఆరిపోయెను
    సాహితీసభ శోకము చెందియున్నది.

---

1. దాగ్ - ఢిల్లీలోని లాల్‌ఖిలాలో పుట్టిపెరిగి, హైదరాబాదులో మరణించిన మహాకవి.

2. మహాది మజరూహ్ - ప్రాచీనకవులు

3. అమీర్ మీనాయి-ప్రసిద్ధకవి

ఢిల్లీ బుల్‌బుల్

ఆ నందవనమున కట్టుకొనెను గూటిని
జీవన వనమున
కోకిలలన్నియు కూడ కూయుచున్నవి,
చనిపోయెను, దాగ్, అయ్యో
పాడె అతనిది భుజశోభయాయెను
ఢిల్లీ కడపటికవి నిశ్శబ్దుడాయెను.

ఇకనెక్కడ ఆ చమత్కారములు
వర్ణనావైఖరుల సొబగులు
వృద్ధాప్యపు కర్పూరమున
దాగియుండెను యౌవనాగ్నులు.
ఆయన ముఖమున వెల్వడిన కోరికలే
అందరిహృదయముల దాగి ఉండినవి.
ఆయనకడ, అర్థమను లైలా
మేలిముసుగును వదలినది
అంతదనుక మేనాలో కూర్చుని ఉండినది.
ఇక ఎవరు అడుగగలరు
పవనముల ప్రసూన మౌనరహస్యముల
ఎవరు ఎరుగగలరు
వనముల కోకిల రోదనా రహస్యముల!
భావముతో ఎగురుటలో
వాస్తవికతపట్ల ప్రమత్తుడు కాలేదు.

పక్షి ఎగురుచుండియు
గూటిమీదనే దృష్టిని నిలిపియుండెను.
సూక్ష్మదర్శియగు భావములతో
ఆకసమున కొలతలు వేయుచు
భిన్న శీర్షికల సొంపుల
మన కిక ఎవరు చూపగలరు?
యుగతి క్తరుచుల రూపును
ఎవరిక చిత్రించి ఏడ్పించగలరు?
కల్పనా నవ్యజగత్తును
ఎవరిక చూపించి ముగ్ధులచేయగలరు?
ఈ తోటలో షీరాజ్[1] కోకిల హాఫిజ్[2] వంటి
మధురభావుకులు పుట్టగలరు,
శతమానములుగ కవులు
అద్భుతముల చూపగల దివ్యశక్తి గలవారు.
కళామందిరములలో
వేలశిల్పాలు ఉద్భవించగలరు.
మధువును త్రాగించెదరు
కొత్తసాఖీలు, క్రొత్తపాన పాత్రలతో,
హృదయగ్రంథాలకు
చాల వ్యాఖ్యానములు వ్రాసెదరు.

---

1. పారశీక దేశమునందలి ఒకపట్టణము

2. ప్రసిద్ధ పారశీక కవి (వేదాంతవేత్త)

యౌవన స్వప్నములారా !
   మీ అర్థములు చాలమంది చెప్పగలరు.
కాని ప్రేమచిత్రమును
   యథాతథముగ ఎవరు వ్రాయగలరు?
గురితప్పక బాణములువేయు
   యోధుడు కూలిపోయెను.
ఇక హృదయములపై
   అంబుల ఎవరు విసరగలరు?
కవితా క్షేత్రములలో
   అశ్రుబీజముల నాటుచున్నాను.
ఢిల్లీప్రాంతమా నీవును ఏడ్వుము
   దాగ్ కొరకై నేను ఏడ్చుచున్నాను.
ఢిలీ సాహిత్యగోష్ఠుల
   కేంద్రస్థానమా !
మరల నేడు నీ వనము
   శిశిరముచే ధ్వంసమాయెను.
వెడలిపోయెను సుగంధముల రీతియే
   నీ ఆ బహువర్ణప్రసూనము
ఆయ్యో, ఉద్యానవనము
   దాగ్ లేక ఖాళీ ఆయెను.
లేకపోయెను కాబోలు
   నీ ప్రాంతపుమట్టిలో అట్టి ఆకర్షణ.

ఆ పూర్ణచంద్రుడు మరుగుపడెను
దూరదక్కన్, ధూళిలో
ఉండిన సాక్షిలు లేచిపోయిరి
మధుశాల శూన్యమాయెను.
ఢిల్లీ సభల జ్ఞాపకార్థము
ఒక్క హోలికవి మిగిలి ఉన్నాడు.

అన్యాయపు మృత్యువు
అభిలాషలచే రక్తాశ్రువుల కార్పించినది.
మృత్యువను వేటకాడు
అంధకారముల బాణముల విసరుచున్నాడు
కాని దోషారోపణకై నోరాడకున్నది.
తోట ఉనికికి కారణమగుచున్నది.
శిశిరంపు చేష్టలుకూడ:

విశ్వవ్యాప్తమగు
శాసనాలె సర్వమును ప్రభావితము చేయును.
వనమునుండి
పుష్పపరిమళముల నిర్గమనము
ప్రపంచమునుండి
తోటమాలి ప్రయాణము.

ఢిల్లీ,
14-7-64.

—: o :—

# 3. మీర్జా గాలిబ్

మానవుల భావముల మీద
నీ వ్యక్తిత్వము వెలుగులు ప్రసరించెను.
కల్పనా విహంగపు పక్షములు
ఎంతో దూరము చేరగలవు.
నఖశిఖ పర్యంతము నీవు ఆత్మవు
సాహిత్యసఖలు నీ శరీరము.
గోష్ఠుల శోభగా ఉంటివి
గోష్ఠుల వెనుకను దాగి యుంటివి.
జీవన దీప్తియై
ప్రతివస్తువునందును దాగి యున్నదో
ఆ సౌందర్యము నే కాంచుటకు
నీ చక్షువులకు సమ్మతి మాయెను.

జీవిత గోష్ఠి యైన ఈ ధరణి
నీ వాద్యములచే భాగ్యశాలి యాయెను.
శైల మాలల శాంతి
నదుల కలగానముల వలె.
నీ కల్పనా వైకుంఠముచే
ప్రకృతికి వసంతము—: ం :—
నీ భావనా కేదారములలో
మొలచినవే ఈ ఇలను సస్యశ్యామల మొనర్చెను.

జీవితమంతయు దాచబడెను.

నీ రచనా చమత్కారములలో

సంభాషణార్థము కదలుచున్నవి

నీ చిత్తరువుల అధరములు.

నీ అద్భుత శక్తి సంపన్నమైన అధరములపై

శతాభిమానముల పొందుచున్నది.

వాక్ శక్తి.

నీ ఉన్నత విహారముల తిలకించి

శుక్రతార విస్మయములో నిమగ్నము.

నీ శైలి విలాసముల కాంచి

శీర్షికా ప్రేయసి బలి కాగోరుచున్నది.

ఢిల్లీ కళిక నవ్వుచున్నది

షిరాజ్[1] పుష్పముల ఈసడించి

అయ్యో! ఈ దురదృష్టపు ఢిల్లీలో

శాశ్వత నిద్రలో ఉన్నావు.

వేమరు[2] వనములో నిద్రించుచున్నాడు.

నీ సహగాయకుడు గేటే[3]

సరస సంభాషణలో

నీ సరి సమానులు లేరు.

పూర్ణ భావ సంపత్తు

ఉన్నత కల్పనలతో సరితూగినది.

---

1. పారశీక దేశమునందలి ఒక పట్టణము.
2. గేటేకవి సమాధి నొందిన గ్రామము-జర్మనీ దేశములోనిది.
3. జర్మనుకవి ప్రసిద్ధకవి.

అయ్యో! హిందూస్థాన్ ప్రాంతమునకు
ఎట్టికీడు వాటిల్లెను.
ఆదృశ్య వైభవము
సూక్ష్మ విషయగ్రాహియైనదృష్టి ఏమాయెను?
ఉర్దూ కుంతలములకు
ఇంకను నీ దువ్వెన ఆవశ్యకమై యున్నది.
శలభానికి హృదయతాపమును
కల్గించు ఉన్మాదమై యున్నది ప్రదీపము.
అయ్యో! ఢిల్లీ! కళలకు శిల్పములకు
ఉయ్యేల వంటిదానా
నీ దేహ మంతయు రోదనము
ఇంటా వాకిటా నిశ్శబ్దము.
నీ అణువు అణువులో
సూర్యచంద్రసములు నిద్రించుచున్నారు.
నీ ధూళిలో దాచబడినవి
లక్షల ముత్యములు.
ఇట్టివారిలో యుగ గర్వ కారకులు
ఎవరైనా, గోరీ కట్టబడిరా?
కాంతితో మెరిసే ముత్యములు
ఇట్టివి ఏమైనా, పాతిపెట్టబడినవా?

15-9-64
ఢిల్లీ.

—:o:—

# 4. ఒక కోరిక

ప్రపంచ గోష్ఠులతో
　　విసిగి పోయితి దైవమా!
సభలతో ఏమి ఆనందము
　　హృదయమే ఆరిపోగా
అలజడు లనుండి పారిపోయి
　　నా డెందము వెదుకుచున్నది.
సంభాషణయు, వెర్రియగుశాంతిని
నిశ్శబ్దమునకై పడిచచ్చుచున్నాను.
　　ఇదే నా కోరిక.
కొండ కొంగువలె నున్న లోయలో
　　చిన్నగుడిసె కావలె.
భావముల చెరనుండి ముక్తుడనై
　　ఏకాంతమున దినములు గడపవలె.
లోక విచార భరితమగు నా గుండె నుండి,
　　ముళ్ళు అన్నీ వదలవలె.
పక్షుల కల స్వనములలో
　　సంగీత సుఖము పొందవలె.
నీటి చెలమల చప్పుడులలో
　　తంబురా మీటుచున్నట్లుండవలె.

పూ మొగ్గలు అరవిచ్చి

ఎవరికైనా నా వార్తలు చెప్పునట్లుండవలె.

చిన్ని మధుపాత్రల వలె

ప్రకృతి శోభను గ్రోలించవలె.

చేతులే తలదిండ్లు కావలె

పచ్చని పచ్చికలే పడకలు కావలె.

వెలుగులు సిగ్గిలు నట్టి

సొగసులు ఏకాంతమున అమరవలె.

నా స్వభావమునచ్చే పశులు

ఎంతో చనవుగ మచ్చిక కావలె.

నన్ను చూచి, వాని, చిరుత, డెందములలో

ఎట్టి జంకులు రాకుండవలె.

ఇరు కెలంకుల బారులు తీరిచి

చెట్లు పచ్చగ నుండవలె.

నదిలోని తేటగు నీళ్ళు

చిత్తరువుల తీరు యుండవలె.

శైల మాలల దృశ్యములు

ఎంతో మనోహరముగ నుండవలె.

నీరములు కూడ తరంగములై

ఎగిరిఎగిరి తిలకించవలె.

ఆ ప్రదేశపు అంకము నందు

పచ్చదనము హాయిగ నిద్రించవలె.

జొంపములచుట్టు తిరుగుచు
  నీరు మెరయుచు పారవలె.
పువ్వులు లేత కొమ్మలు
  వంగివంగి నీరఘుల నిమరవలె.
ఎదో అందగత్తె అద్దములో
  తనవేష భూషల చూచునట్లుం
సంజెయను పెండ్లి కుమార్తెకు
  సూర్యుడు గోరంటు పెట్టినట్లుం
పసిమి ఎర్రని ముస్తాబుల,
  పువ్వుకన్నెలు తాల్చి నట్లుండ
రాత్రి ప్రయాణము చేయువారు
  అలసి నిలిచిపోయిన తరి
వారి అశలన్నియు
  పగిలిన ప్రమిదవలెనున్న తరి
వారికి మెరపు మెరసి
  నాకుటీరమును చూపవలె.
ఆకసపు నాలుగు చెరగుల
  మబ్బులు గుమి గూడిన తరి
వేకువ వైతాళికుల వలె
  తుది జాముల కోకిలలు కూయ
నేను వాని తోడి గాయకుడను
  అవి నా సహగాయకులు కావ

ధర్మము దైవము పిలుపులు
నా కర్ణముల చొరని తరి
నా గుడిసె కప్పు చిల్లులు
ప్రొద్దు పొడుపును తెలుప వలె.
తుషారములో పూజాప్రక్షాళనము
ప్రసూనములు చేయు తరి
నా రోదనాశ్రువులే
స్నానజలములు కావలె.
నా విలాపములే ప్రార్థనలు కావలె.
ఈ నిశ్శబ్దములో నా ఆక్రందనములు
ఎంతో ఉన్నతములై పోవలె.
తారల ప్రయాణపు జట్టులకు
నా గొంతే గంట కావలె.
సానుభూతి పరుల గుండెలను
నా ఏడ్పులే ఏడ్పించవలె.
మైమరచి పడియున్నవారిని
అవే బహుశా మేల్కొల్పవలె.

ఢిల్లీ :
20-9-64

—: o :—

# 5. క్రొత్త శివాలయము

నిజము చెప్పెద బ్రాహ్మణుడా
నీవు తప్పు అనుకోనకపోతే
నీ దేవాలయములోని మూర్తులు
పురాతనములై పోయెను.
సొంతవారితో వైరము పెట్టుకొనుట
నీవు ఆ మూర్తులనుండే నేర్చితివి.
కలహములు పోరాటములు
మౌల్వీకిని నేర్పించెను ఖుదా
తుదకు నేను విసిగిపోయి
మందిరమును మస్జిదును వదలితి.
మౌల్వి ఉపదేశముల వదలితి
నీ పురాణగాథలను వదలితి
నీవు, 'రాతిమూర్తులలో
దేవుడున్నాడని తలచితివి.
దేశధూళి అణువు అణువునందును
నాకు దేవుడు కాన్పించును.
పరాయితనపు పర్దా
రా, తిరిగి ఒకతూరి ఎత్తివేసెదము.
చెదరిపోయినవారిని తిరిగి కలిపెదము
ద్వందపు బింబమును తుడిచివేసెదము.

డెందము అనుపల్లె, బహుకాలముగ
  శూన్యమై పడియున్నది.
ఒకకొత్త శివాలయమును
రా, ఈ దేశమున కట్టెదము.
ప్రపంచములోని తీర్థములలో
  ఉన్నతము కావలె మనతీర్థము.
ఆకసపు కొంగులతో
  దీని కలశముల కలిపెదము
ప్రతి ఉదయము లేచికూర్చుని
  ఆ మంత్రముల జపించెదము.
పూజారు లందరిచే
  ప్రేమసుధను పానము చేయించెదము.
శక్తియు శాంతియు
భక్తుల గీతములలో కలవు
ధరిత్రీ నివాసుల ముక్తి
ప్రేమలోనే కలదు.

22-9-64

ఢిల్లీ

—: o :—

# 6. రాష్ట్రగీతము (సారేజహాఁసేఅచ్ఛా)

సమస్త ప్రపంచములో మెరుగైనది
    మన హిందూస్థానము,
మనము దీని బుల్‌బుల్[1] లము
    ఇది మన ఉద్యానవనము
పరదేశమున మనము ఉన్నను
    ఉండును దేశముమీదనే చిత్తము.
తెలిసికో! మనచిత్తమున్న తావుననే
    మనముకూడ నివాసము
పర్వతములు అన్నిటికన్న ఉన్నతములు
    గగనమునకు ఇరుగుపొరుగులు.
అవే మన దుర్గరక్షకులు.
    ఆ వేమన కాపలావారు
దీని అంకములో వేలనదులు
    ఆటలాడుచున్నవి.
వీనిస్పర్శలే మనకు పైరుపంటలు
    స్వర్గమునకు ఈర్ష్యాకారకములు
గంగా ప్రవాహమా!
    ఆ దినములు నీకు ఉన్నవా జ్ఞాపకము

---

1. కోకిలవంటి పక్షి

బారులు బారులుగ బాటసారులు
నీ ఒడ్డుల విడిది దిగిరి.

మనలో మనము పోరుటకు
మతములు నేర్పలేదు.
భారతీయులము మనము
దేశము మనది హిందూస్థానము
యూనాన్, ఈజిప్టు, రోములు
పుడమిలో తుడుచుకొని పోయినవి.
కాని ఇంకను సజీవములుగ నున్నవి
మన పేరు ప్రతిష్ఠలు.
కొన్ని గుణములున్నవి
అందుననే మనవ్యక్తిత్వము తగ్గలేదు.
శతాబ్దములుగ శత్రువులుగ నున్నవి
మనకు కాలభ్రమణములు
ఇక్బాల్ ! ఇలలో లేరు
మనరహస్యముల నెరిగినవారు
దాచబడిన వేదనలు మనవి
ఎవరికేమి ఎరుక ?

23-9-64

ఢిల్లీ.

—: o :—

# 7. జావిద్ పేర

(లండన్‌లో నుండగా కొడుకు జావిద్ తనసొంత అక్షరములతో వ్రాసిన మొదటి ఉత్తరమును చూచి)

1. ప్రేమ ప్రపంచములో నీ స్థానమును సృష్టించుకో
క్రొత్త యుగము, క్రొత్త ఉదయాస్తమానాలను
సృష్టించుకో.

2. ఈశ్వరుడు నీకు ప్రకృతి హృదయమును ఎరుకచేస్తే
పుష్పముల మౌనముతో సంభాషణాశక్తి సృష్టించుకో.
(11-7-76)

3. పాశ్చాత్యుల విలువైన సీసాలు, కృతజ్ఞతతో ఎత్తకు
భారత వర్షపు మట్టితోనే, నీ కూజా పాత్రలు సృష్టించుకో.

4. నేను అతల ఆసక్తితో చూచుచున్నాను
నా కవితలే నాఫలములు.

5. నా విధానము ఐశ్వర్యవంతులది కాదు.
సాధు సన్యాసులదే.

ఆత్మను అమ్ముకోవద్దు
పేదరికములోనే పేరును సృష్టించుకో.

నిశ్శబ్దముగ నుండెను చంద్రుని వెన్నెల
శాఖలతో నిశ్శబ్దముగ నుండెను ప్రతి వృక్షమును.
లోయలో పాటలు పాడే పిట్టలు నిశ్శబ్దము
శైలమూలలు పచ్చవేషములు దాల్చి నిశ్శబ్దములు

ప్రకృతి మైమరచి నట్లుండెను.
రాత్రి ఒడిలో నిద్రించుచుండినట్లుండెను.

ఏదో శాంతి మంత్రశక్తివలె నుండెను.
[1]నేకర్ నదీ గమనమును శాంతిని వహించెను.

తారల నిశ్శబ్దపు జట్లులు బయల్వెడలినవి
ఈ దండులు గంటలు లేకనే పయనించుచున్నవి.

నిశ్శబ్దములు కొండలు, ఎడారులు, సముద్రములు
ప్రకృతి ధ్యాన నిమగ్నమాయెనా యను నట్లుండెను.
(19-7-76)

హృదయమా నీవును శాంతింపుము.
అంకమునందు దుఃఖమును గైకొని నిద్రింపుము.

---

1. జర్మనీలో ఒక నది పేరు.

—:०:—

# 8. కొండల మబ్బు

ఎత్తైె ఆకసమును ముద్దిడు గూడునాది,
శైలతరంగముల మేఘమును నేను
చేలాంచలము నాది పుష్పభరితము
ఎడారులు కొన్ని వేళల
ఉద్యానవనములు కొన్ని వేళల
విడిదినాది.
నగరములు మరుభూములు నావే
అరణ్యములు సముద్రములు నావే
ఎచ్చటో లోయలో నిద్రించడం నాకు ఇష్టమే.
కొండల పచ్చదనము, మఖ్మల్ పడకయై
నాకు ప్రియమే.
ముత్యములు రాల్చడం ప్రకృతి నాకు నేర్పెను.
సాక్షాత్కరించిన దైవకృపయగు
మబ్బుల ఒంటెలను తోలే గాయకుడను.
హతాశుడై క్రుంగిన కర్షకుని డెందముల
నవాంకుర సస్యక్షేత్రములుగ నొనర్చి
సిరిసంపదల శోభా భవనముగ మార్చుదును.
జీవనకపోలములపై అలకలనె పర్వేదను
గాలిఅలల దువ్వెననై సరిదిద్దుదును.

దూరమునుండే ఆశా నేత్రముల తృప్తి పరచెదను
ఏదో పల్లెపై మౌనముగ తేలి పోయెదను.
విహరిస్తూ నదీ ముఖమునకు చేరగా
ప్రవాహములో సుడిగుండముల సృష్టించి
నదీ కర్ణములకు పోగులు పెట్టెదను.
క్రొత్తగ మొలిచే పంటచేల కోరికల తీర్చెదను
సముద్ర సంజాతను నేను
సూర్యపాలితను నేను.
కొండ సెలయేటికి కదలి ఘోష కల్పించెదను
పక్షుల గాన తత్పరములుగ కావించెదను
పచ్చని బయళ్ళ తలలపై నిలిచి
మొక్కల 'లే'యని ఆనతిచ్చెదను.

పుష్పముకుళములకు హాసవినోదాలు కల్పించెదను.
నా కనికరముచే చీకటిరాత్రుల కాన్పించును.
కొండ కొంగు లోయలోని కర్షకుల కుటీరములు,

10-7-76

—:o:—

# 9. రాత్రి - కవి

రాత్రి :-

ఎందులకు నా వెన్నెలలో తిరుగుచున్నావు
వ్యాకులుడవై
పుష్పాకారమున మౌనము దాల్చి
సుగంధము వలె వ్యాపకుడవై
తారామౌక్తికముల, బహుశా పరీక్షించు వ్యాపారివి నీవు
ఏదో నా కాంతివాహినిలో మీనము నీవు.
లేక నా ముఖఫలకమునుండి రాలినతారవా?
ఉన్నత విహారము వదలి పడి క్రింద వసించుచున్నావా?
జీవన వాద్యపు తంత్రులు నిశ్శబ్దములాయెనా
జీవిత స్వప్నచిత్తరువుల చూపు నా దర్పణమువా!

సింధు అగాధమున సుడి గుండపు కన్ను నిద్రించుచున్నదా?
తీరమును కొట్టుకొని చంచల తరంగము నిద్రించుచున్నదా?
నేలపై నున్న పల్లెసీమలు ఎట్టి అలజడులు కల్పించుచున్నవి
ఇనులే కాపురము చేయునటుల కనులు మూయుచున్నవి.
కవి హృదయమే, కాని శాంతి ఎరుకలేదు.
ఎటుల మేల్కొని ఉన్నావు నా మంత్రప్రభావమును ధిక్కరించి!

కవి :-

నేను నీ వెన్నెల మాగాణములలో ముత్యముల నాటించుచున్నాను.

మానవులతో విసిగి, నిశాంతతార వలె మౌనముగ ఏడ్చుచున్నాను.

దిన ఆందోళనలతో తీరిక లేక, సిగ్గిలుచు
రాత్రి ఏకాంతమున, నా అశ్రువులు రాలుచున్నవి.
నాలో అణచబడిన ఆవేదనను ఎవరికి వినిపించెదను.
నాకోర్కెల తీక్ష్ణ దృశ్యముల ఎవరికి చూపించెదను ?
నా నిర్భయమగు పిడుగు, నా గుండెపై బడి ఏడ్చుచున్నది.
చూచుకన్నులు ఎటుల నిదురించగలవు?
సమాధి దీపములవలె, నా మిత్ర మండలియు పరిసమాప్తి నొందెను.
అయ్యో! రాత్రీ నాగమన ధ్యేయము ఇంకా చాల దూరముగ
నున్నది.

వర్తమాన యుగవాతావరణము దానికి ప్రియముకాదు.
తనకు సంభవించు నష్టము తనకు ఎరుకలేదు.
ప్రేమ సందేశమును ప్రకటించ నేను తత్తర పడుచున్నాను.
నీ మెరిసే చుక్కలకు వినిపించుచున్నాను.

—:o:—

# 10. పక్షి-మిణుంగురు పురుగు

మునిమాపువేళ ఒక పాడేపిట్ట
కొమ్మపై కూర్చుని పాడుచుండెను.
నేలపై మెరిసే వస్తువొకటి కాంచెను.
పక్షి ఎగిరి దిగివచ్చెను, అది మిణుగురనే తలంచి
మిణుగురనెను "ఓ పాటలపాడే విహంగమా,
దీనురాలైన నాపై, నీ చుంచువు వాడినిచూపకు.
నీకు పాటను, పుష్పులకు సువాసన ఎవ్వడిచ్చెనో
ఆ ఈశ్వరుడే నాకు వెలుగునిచ్చెను.
కాంతివస్త్రములచే కప్పబడినదానను.
పురుగుల పుడమిలో, వెలుగుకొండను నేను,
నీ కలగానము స్వర్గ కర్ణములకు ప్రియమైతే
నా కాంతి వైకుంఠనేత్రములకు పర్వమగును.
నా రెక్కలకు ప్రకృతి వెలుగు నిచ్చెను,
నీకు హృదయముల మోహింపజేయు, నాదము నొసగెను.

"నీనోటికి పాటల నేర్పెను.
నన్ను తోట కాగడాగ నొనర్చెను.
కాంతి ప్రసాదించెను నాకు
సంగీతజంత్రము నీకు.
కాంతితప్పన, సంగీతజంత్రమును

ప్రతిఘటించలేదు.
పృథ్విలో అవి రెండును
సమఆసనమున కూర్చున్నవే.
జీవన భవనముల నివాసము అన్నిటితో
నిమ్నోన్నతముల ప్రదర్శన అన్నిటితో
ప్రపంచ సంగీతశాలలో
ఒకేశ్రుతిలో మ్రోగును అన్ని స్వరములు.
పరిమళముల ఉద్యానవనమునకు
అన్నిపువ్వులతో వసంతము.

10-7-76.

—:o:—

خودی کو کر بلند اتنا کہ ہر تقدیر سے پہلے
خدا بندے سے خود پوچھے بتا تیری رضا کیا ہے

ख़ुदी को कर बलंद इतना कें हर तक़दीर से पहले
ख़ुदा बन्दे से ख़ुद पूछे बता तेरी रज़ा क्या है ?

అన్ని అదృష్టాల కన్న మిన్నగ
ఆత్మను పెంచుకో! అప్పుడు
దేవుడే భక్తుని స్వయముగ అడుగును
"చెప్పు నీ ఇష్టమేమని"?

خودی کا نشیمن ترے دل میں ہے
فلک جس طرح آنکھ کی تل میں ہے

ख़ुदी का नशेमन् तेरे दिल में है
फ़लक जिस तरह् आँख की तिल में है।

ఆత్మగూడు నీ డెందములోనే,
ఆకసము కనుపాపలలో ఇమిడినరీతి.

خودی کیا ہے راز دروں حیات
خودی کیا ہے بیداری کائنات

ख़ुदी क्या है राज़े दरूने हयात
ख़ुदी क्या है बेदारिए कायनात ।

ఆత్మ అంటే ఏమి? జీవనసంఘర్షణల రహస్యము!
ఆత్మ అంటే ఏమి? సృష్టిని మేల్కొలుపడం!

خودی کے ساز میں ہے عمر جاوداں کا سراغ
خودی کے سوز سے روشن ہیں امتوں کے چراغ

ख़ुदी के साज़ में है उमरे जाविदाँ का सुराग़
ख़ुदी के साज़ से रोशन है उम्मतों के चिराग़ ।

ఆత్మ యంత్రములోనే
శాశ్వతజీవన అన్వేషణ
ఆత్మ జ్వలన చేతనే
జాతుల దీపములో వెలుగు.

خودی میں ڈوبتے ہیں پھر ابھر بھی آتے ہیں،
مگر یہ حوصلہ مردِ ہیچ کارہ نہیں

ख़ुदी में डूबते हैं फ़िर उभर भी आते हैं
मगर यह हौसला मर्दे हेच का रह नहीं।

అహంలో మునుగు తున్నారు
తిరిగి పైకి తేలుతున్నారు - విజ్ఞులు;
కాని ఈ సాహసము
అజ్ఞులలో లేదు.

خودی ہو زندہ تو بحر بے کراں پایاب
خودی ہو زندہ تو کوہسار پرنیاں و حریر

ख़ुदी हो ज़िन्दा तो बहरे - बेकराँ पायाब
ख़ुदी हो ज़िन्दा तो कोहसार पर्नियाँ व हरीर।

ఆత్మ బ్రతికి ఉంటే
అపార సాగరాలు నడకతోనే దాటవచ్చు;
ఆత్మ బ్రతికి ఉంటే
కొండ వరుసలు మఖ్‌మల్‌వలె మెత్తన.

خودی ہو زندہ تو فقر بھی شہنشاہی
نہیں ہے طغرل و سنجر سے کم شکوہ فقر

ख़ुदी हो ज़िन्दा तो फ़िक्र भी शहंशाही
नहीं है तग़रिल व संजर से कम शिकोह फ़िक्र ।

ఆత్మ బ్రతికి ఉంటే
దరిద్రుడే మహారాజు;
లేకున్న, మహారాజే దరిద్రుడు.

خودی کی موت سے مشرق کی سرزمینوں میں
ہُوا نہ کوئی خدائی کا رازداں پیدا

ख़ुदी की मोत से मशिरिक़ की सर ज़मीनो में
हुआ न कोई ख़ुदा का राज़दाँ पैदा ।

ఆత్మ చావగా
తూర్పునాడుల మాగాణములలో,
దైవ రహస్యములు ఎరిగినవారు,
ఎవరును పుట్టలేదు.

خودی ہو مردہ تو مانند کاہ پیش نسیم
خودی سے زندہ تو سلطان جودات

ख़ुदी हो मुर्दा तो मानिन्द काह पेशे नसीम
ख़ुदी से ज़िन्दा तो सुलताने जुदात।

ఆత్మ చచ్చిపోతే, గాలి ఎదుట
గడ్డి పోచవలె నుందువు
ఆత్మ బ్రతికి ఉంటే
నీవు చరాచరముల ఏలు చక్రవర్తివి.

حیات کیا ہے، خیال و نظر کی مجذوبی
خودی کی موت ہے اندیشہ ہائے گوناگوں

हयात क्या है खियाल व नजर की मजजुबी
खुदी की मौत है अन्देषए हाए गुनगुं ।

జీవితమనగా, దృష్టి ఆలోచనల సమైక్యత
ఆత్మ చావగా
భిన్న భిన్నమైన సందేహాలు;

نہ ہے ستاروں کی گردش نہ بازیٔ افلاک
خودی کی موت ہے تیرا زوال نعمت و جاہ

है सितारों की गर्दिश न बाज़िए अफ़लाक
ख़ुदी की मौत है तेरा ज़वाले नैमतो जाह ।

తారల భ్రమణములు
ఆకసముల పరివర్తనాలు కావు,
నీ ఆత్మయొక్క చావు
నీ వైభవముల పతనము.

کسے نہیں تمنّائے سروری لیکن!
خودی کی موت ہو جس میں وہ سروری کیا ہے

किसे नही तमन्नाए सरवरी लेकिन
ख़ुदी की मौत हो जिस में वह सरवरी क्या है ।

ఎవరిలో లేదు
పెద్దరికపు కోరిక ?
ఆత్మ చావగా
ఇక ఎక్కడిది వాని పెద్దరికము?

بے ذوق نمو زندگی موت
تعمیر خودی میں ہے خُدائی

बे जौक़ नमू जिन्दगी मौत
तामीरे ख़ुदी में है ख़ुदाई ।

నీ జీవనమే చచ్చును
అభివృద్ధి, అభిలాష లేనపుడు
కలదు దైవత్వము
ఆత్మ నిర్మాణములోనే.

تو اپنی خودی کھو چکا ہے
کھوئی ہوئی شے کی جستجو کر

तू अपनी ख़ुदी खो चुका है
खोई हुई शै की जुस्तजू कर।

పోగొట్టు కొంటివి
నీ ఆత్మను నీవు
అన్వేషింపుము
పోగొట్టుకొన్న వస్తువును.

اغیار کے افکار و تخیّل کی گدائی
کیا تجھ میں نہیں اپنی خودی تک بھی رسائی

अग्यार के अफ़कारो व तख़य्युत की गदाई
क्या तुझ मे नहीं अपनी ख़ुदी तक भी रसाई ।

అర్థించడం దేనికి?
ఇతరుల తలపులకై, ఊహలకై?
లేదా ఏమి నీలో
నీ ఆత్మను చేరగలగడం?

خودی میں ڈوبنے والوں کی عزم و ہمّت نے
اس آبجو سے کئے بحرِ بیکراں پیدا

खुदी में डूबने वालों की अज्मो हिम्मत ने
इस आबजू से किए बहरे - बेकराँ पैदा ।

ఆత్మలో మునిగే వారి
స్థైర్య సాహసాలే
సృష్టించాయి ఈ కాలువలోనే
అనంత సాగరాలు.

خودی میں ڈوب جا غافل یہ سرِ زندگانی ہے
نکل کر حلقۂ شام و سحر سے جاوداں ہو جا

खुदी में डूब जा ग़ाफ़िल ये सर जिन्दगानी है
निकल कर हल्क़ए शामो सहर से जाविदाँ हो जा।

ప్రమత్తుడా! ఆత్మలో మునిగిపో
ఇదే జీవిత రహస్యము
ప్రభాత సంధ్యా శృంఖలమునుండి
బయటపడి, శాశ్వతత్వమును పొందు.

ہزار چشمے ترے سنگِ راہ سے پھوٹیں
خودی میں ڈوب کے ضربِ کلیم پیدا کر

हज़ार चश्मे तेरे संग राह से फूटें
खुदी में डूब के ज़र्बे कलीम पैदा कर।

నీ రాళ్ళ బాటలో పుట్టాయి
వేల చలములు
ఆత్మలో మునిగి కలీం[1] రీతి
దెబ్బకొట్టి దారి చేసికో.

خودی وہ بحر ہے جس کا کوئی کنارہ نہیں
تو آبجو اسے سمجھا اگر تو چارہ نہیں

खुदी वह बहर है जिस का कोइ किनारा नहीं
तू आबजू इसे समझा अगर तो चारा नहीं ।

గట్టులులేని కడలి
నీ ఆత్మ;
నీవు దాన్ని కాలువగా అనుకుంటే
నీకు వేరే గతే లేదు.

خودی جلوہ بدست خلوت پسند
سمندر ہے اک بوند پانی میں بند

खुदी जल्व: बदस्ते खि़लवत पसंद
समंदर है इक बूंद पानी में बंद ।

ఆత్మ, వెలుగు వైపులో వుంది
ఏకాంతాన్ని కోరును;
జలబిందువులో బంధితమైన
సింధువు అది.

خودی شیر مولیٰ جہاں اس کا صید
زمیں اس کی صید آسماں اس کا صید

ख़ुदी शेर मौला जहाँ इस का सैद
ज़मीं इस की सैद आस्माँ इसका सैद।

దేవుని పులి ఆత్మ,
ప్రపంచము దాని వేట;
భూమి దాని వేట;
ఆకసమును దాని వేట.

خودی سے اس طلسم رنگ و بُو کو توڑ سکتے ہیں
یہی توحید تھی جس کو نہ تو سمجھا نہ میں سمجھا

खुदी से इस तिलिस्मो बू को ताड सकते हैं
यही तौहैद थी जिस को न तू समझा न मैं समझा।

వాసనల రంగుల ఇంద్రజాలమును
ఆత్మచే ఛేదింపగలము
ఏకత్వమది, దాన్ని
నీవుగాని నేనుగాని గ్రహింపలేము.

خودی کو نہ دے سیم و زر کے عوض
نہیں شعلہ دیتے شرر کے عوض

खुदी को न दे सीमो ज़र के एवज़
नही शोला देते शरर के एवज़ ।

ఆత్మను ఇయ్యవద్దు
వెండి బంగారములకు మారుగా,
అగ్నిజ్వాలను ఇయ్యవద్దు
నిప్పు రవ్వలకు మారుగా.

خودی کے نگہباں کو ہے زہر ناب
وہ ناں جس سے جاتی رہے اس کی آب

खुदी के निगहबाँ को है ज़हर नाब
नान जिस से जाती रहे इसकी आब ।

ఆత్మను కాపాడుకొనగల వారికి
శక్తివంతమైన విషరసముకూడ
శక్తిని పోగొట్టుకొని,
దివ్య ఆహారము అగును.

جس بندہ حق بیں کی خودی ہوگئی بیدار
شمشیر کے مانند ہے برندہ و براق

जिस बन्दए हक़बीं की ख़ुदी हो गई बेदार
शम्शीर के मानिन्द है बरन्दः व बुर्राक़ ।

దేవునిచూచు భక్తుడు
ఆత్మజాగృతము కాగా,
వాడిగల, కాంతిగల
ఖడ్గమువలె అగును.

اس قوم کو شمشیر کی حاجت نہیں رہتی
ہو جس کے جوانوں کی خودی صورتِ فولاد

उस कौम को शमशीर की हाजत नही रहती
हो जिस के जवानों की ख़ुदी सूरते फौलाद।

ఆ దేశమునకు
ఆయుధములతో పని లేదు,
యే దేశ యువకుల ఆత్మ ఆశయము
ఉక్కువలె గట్టి అగునో.

گراں بہا ہے تو حفظ خودی سے ہی ورنہ
گہر میں آب گہر کے سوا کچھ اور نہیں

गिराँ बहा है तू हिफ़्ज़े ख़ुदी से ही वर्ना
गुहर में आब गुहर के सिवा कुछ और नहीं।

నీ విలువ, అధికము-
ఆత్మ సంరక్షణ చేతనే
లేకున్న, ముత్యములో
మెరయుట తప్ప, ఇంకేమియూ లేదు.

تری زندگی اسی سے تری آبرو اسی سے
جو رہی خودی تو شاہی نہ رہی تو روسیاہی

तेरी ज़िन्दगी इसी से तेरी आबरू इसी से
जो रही खुदी तो शाही न रही तो रूसियाही ।

నీ జీవితము దానివల్లనే
నీ గౌరవము దానివల్లనే,
ఆత్మ ఉంటే పాదుషా
లేకున్న సిగ్గుమాలినవాడు.

زندگانی ہے صدف قطرہ نیساں ہے خودی
وہ صدف کیا جو قطرہ کو گہر کر نہ سکے!

जिन्दगानी है सदफ़ कतरे निसियां है खुदी
वह सफ़ क्या जो क़तरे को गुहर कर न सके ।

నీ జీవితము ముత్యపుచిప్ప,
వర్ష బిందువు ఆత్మ
అది ఎట్టి శుక్తి !
వర్ష బిందువును ముత్యము చేయలేనిది ?

جوہر زندگی ہے عشق جوہر عشق ہے خودی
آہ کہ ہے یہ تیغ تیز پردگی نیام ابھی

जो हृर जिन्दगी शशके जो हृर इशके खुदी
आहृ की यहृ तेग़ तेज़ पर दो गयी नियाम् अभी ।

జీవితసారము ప్రేమ;
ప్రేమసారము ఆత్మ
అయ్యో, వాడియైన కత్తి
ఇప్పటికిని ఒరలో దాగియున్నది.

وجود کیا ہے فقط جوہر خودی کی نمود
کر اپنی فکر کہ جوہر ہے بے نمود تیرا

वजूद क्या है फ़क़त जोहरे खुदी की नमूद
कर अपनी फ़िकर के जोहर है बे नुमूद तेरा।

అస్తిత్వమేమిటి ?
ఆత్మగుణ ప్రకటన మాత్రమే,
ప్రకటింపబడని గుణమును
ప్రకటించే యత్నముచేయుము.

یہ ہے مقصد گردش روزگار
کہ تیری خودی تجھ پہ ہو آشکار

यह है मक़सद गर्दिशे रोज़गार
के तेरी खुदी तुझ पे हो आशाकार।

కాలభ్రమణ
ఉద్దేశ్యమిదే
నీకు నీ ఆత్మయే
సాక్షాత్కారము కావలె.

میرا طریق امیری نہیں فقیری ہے
خودی نہ بیچ فقیری میں نام پیدا کر

मेरा तरीफ़ अमीरी नही फ़कीरी है
खुदी न बेच फ़कीरी मे नाम पैदा कर।

నా విధానము ఐశ్వర్యవంతులది కాదు,
సాధు సన్యాసులదే
ఆత్మను అమ్ముకోవద్దు
పేదరికములోనే పేరు గడించు.

تجھے گر فقر و شاہی کا بتا دوں
غریبی میں نگہبانی خودی کی

तुझ ग़र फ़क़र व शाही का बतादूँ
ग़रीबी मे निगहबानी ख़ुदी की।

రాజుల ఔన్నత్య రహస్యమును
నీకు తెలుపుదునా ?
నిస్సహాయతలో కూడ
ఆత్మస్థైర్యము నిలుపుకొనిరి.

ہوئی ہے زیر فلک امتوں کی رسوائی
خودی سے جب ادب و دیں ہو گئے بیگانہ

हुई है जेरे फ़लक उम्मतों की रुसवाई
ख़ुदी से जब अदब व दीं होगये बेगाना।

ఆకసము క్రిందనే
జాతులు చెడ్డపేరు పొందినాయి
సాహిత్యము, మతము,
ఆత్మకు దూరము కాగా.

سُنا ہے میں نے غلامی سے امتوں کی نجات
خودی کی پرورشِ لذّتِ نمود میں ہے

सुना है मैंने गुलामी से उम्मतों की नजात्
खुदी की परवरिशो लज्ज़ते नमूद मे है।

ఆత్మ పోషణ చేతను,
సాక్షాత్కారము చేతను,
బానిసత్వము నుండి జాతులు
విముక్తిని పొందెనని వింటిని.

رائی زور خودی سے پربت
پربت ضعف خودی سے رائی

राई जोर ख़ुदी से परबत्
परबत् जोफ़ें ख़ुदी से राई ।

ఆత్మ ప్రేరణచే
ఆవగింజ పర్వతమగు
ఆత్మ బలహీనతచే
పర్వతమే ఆవగింజగు.

فطرت کو دکھایا بھی ہے دیکھا بھی ہے تو نے
آئینۂ فطرت میں دکھا اپنی خودی کو

फ़ितरत को दिखाया भी है देखा भी है तूने
आईनए फितरत मे दिखा अपनी खुदी को ।

ప్రకృతిని చూపించితివి
చూచితివి నీవు,
ప్రకృతి దర్పణములో
సొంత ఆత్మను చూపు.

تقلید سے ناکارہ نہ کر اپنی خودی کو
کر اس کی حفاظت کہ یہ گوہر ہے یگانہ

तक़लीद से नाकार: न कर अपनी ख़ुदी को
कर इसकी हिफ़ाजत के यह गौहर है यगाना।

నిరుపయోగము చేయకు
అనుకరణచే నీ ఆత్మను,
దాని సంరక్షణ చేయుము
అది తులలేని ముత్యము.

تعلیم کے تیزاب میں ڈال اپنی خودی کو
ہو جائے ملائم تو جدھر چاہے اسے پھیر

तालीम कें तेजाब मे डाल अपनी खुदी को
हो जाये मुलायम तो जिधर चाहे इसे फेर।

విద్యా ద్రావకములో
నానవేయుము నీ ఆత్మను
మెత్తనకాగా వినియోగించు
ఎక్కడ వలసిన అక్కడ.

تری خودی میں اگر انقلاب ہو پیدا
عجب نہیں ہے کہ یہ چار سُو بدل جائے

तेरी खुदी अगर इन्क़िलाब हो पैदा
अजब नही हैं कि यह चारसू बदल जाए।

నీ ఆత్మలో విప్లవం పుట్టితే
నాలుగు దిక్కులు మారినా
ఆశ్చర్యం లేదు.

جرأت ہو نمو کی تو فضا تنگ نہیں ہے
اے مردِ خدا ملک خدا تنگ نہیں ہے

जुर्रत हो नुमू की तो फ़िज़ा तंग नही है
ऐ मर्दे ख़ुदा मुल्के ख़ुदा तंग नही है।

ఆవిష్కరించుకొనుటకు
నీకు సాహసముంటే,
వాతావరణము సంకీర్ణము కాదు.
దేవుని మానవుడా! దేవుని దేశము
సంకీర్ణము కాదు.

سکوں محال ہے قدرت کے کارخانہ میں
ثبات ایک تغیر کو ہے زمانہ میں

सुकूं मुहाल है कुदरतके क़ारख़ाने में
सबात एक तगय्युर का है ज़माने में।

ప్రకృతి కార్ఖానాలో
శాంతి దుస్సాధ్యము
పరివర్తన పరంపరతో
నిండియున్నది యుగం.

تو اگر خوددار ہے منّت کش ساقی نہ ہو
عین دریا میں حباب آسانگوں پیمانہ کر

तू अगर खुददार है मिन्नते कशी साक़ी न हो
ऐंन दरयामे हुबाबाब आसानिगो पैमाना कर।

నీవు ఆత్మాభిమానం కలవాడవైతే
సాఖీకికూడా కృతజ్ఞతా పాత్రుడవుకావద్దు
ప్రవాహములో నీటిబుడగవలె
నీ పాన పాత్రను తల్లక్రిందులుగ
ఉంచుకో.

اس دور میں بھی مردِ خدا کو ہے میسّر
جو معجزہ پربت کو بنا سکتا ہے رائی

इस दौर मे भी मर्द खुदा को है मुयस्सर
जो मोज्जिजा परबत को बना सकता है राई।

ఈ కాలములో కూడ
విజ్ఞులగు మానవులకు ప్రాప్తి కాగలదు
పర్వతమును ఆవగింజ
చేయగల దైవశక్తి.

برتر از گردوں مقام آدمی است

اصل تہذیب احترام آدم است

बरतर अज गरदूं मुकामे आदमी अस्त्
असल जहजीब एहतराम आदम अस्त् ।

ఆకసమున కన్న ఉన్నతము
మానవుని స్థానము,
సభ్యతకు ప్రధానమగు లక్షణము
మానవుని గౌరవించుటయే.

آدمیت احترام آدمی
باخبر شو از مقام آدمی

आदमी
आदमियत एहतरामे आदमी ।
बाख़बर शाअज मुकामे आदमी

మానవుని గౌరవించుటయే
మానవత్వము
మానవుని అంతస్థుతో
ఎరుక కలిగి ఉండుము.

قدم در جستجوئے آدمی زن
خدا ہم در تلاش آدمی است

क़दम दर जुस्तजूए आदमी ज़न
ख़ुदा हम दरतलाशे आदमी अस्त ।

మానవుని అన్వేషించడములో
ముందడుగు వేయుము.
దేవుడు కూడ
మనిషిని వెదుకుచునే ఉన్నాడు!

ہیں وہی لوگ جہاں میں اچھے
آتے ہیں جو کام دوسروں کے

हैं वही लोग जहाँ मे अच्छे
आते हैं जो काम दूसरों के।

ప్రపంచములో
ఆ మానవులే ఉత్తములు-
ఇతరుల పనులలో
ఉపయోగపడువారు.

یہی ہے عبادت یہی دین و ایماں
کہ کام آئے انساں کے یک اور انساں

यही है इबादत यही दीनो इमान
कि काम आये इंसान के यक और इंसान।

ఇదే ధర్మము, ఇదే పూజ
ఇదే సచ్చరిత్ర కూడ;
మరియొక మనిషికి
ఉపయోగపడు మనిషి కావడమే.

نہیں تیرا نشیمن قصرِ سلطانی کے گنبد پر
تو شاہیں ہے بسیرا کر پہاڑوں کی چٹانوں پر

नही तेरा नशेमन क़तरे सुलतानी के गुंबद पर
तू शाँही है बसेरा कर पहाड़ों की चट्टानों पर।

కాకూడదు నీ గూడు
సుల్తానుల మహళ్ళ గుమ్మటాల్లో
నీవు గరుత్మంతుడవు
పర్వత శిఖరాలలో కాపురముచేయి.

شاہیں کی ادا ہوتی ہے بُلبل میں نمودار
کس درجہ بدل جاتے ہیں مرغانِ سحرخیز

शाहीं की अदा होती है बुलबुल मे नमूदार
किस दरज बदल जाते हैं मुरगाने सहर खेज़।

గరుత్మంతుని విలాస నైపుణ్యము
కోకిలలో ప్రకటిత మగుచున్నది
ఎట్టి పరివర్తన చెందుచున్నది
ఉదయమును లేపు శకుంతములలో.

دنیا نہیں مردانِ جفاکش کیلئے تنگ
چیتے کا جگر چاہیئے شاہیں کا تجسّس

दुनिया नही मर्दाने जफाकशा के लिये तंग
चीते का जिगर चाहिए- शाहीं का तजस्सुम।

శ్రమపడు మానవులకు,
సంకీర్ణము కాదు ప్రపంచము;
పులుల గుండె కావలె
గరుడుని దూరదృష్టి.

گرماؤ غلاموں کا لہو سوزِ یقیں سے
کنجشکِ فرومایہ کو شاہیں سے لڑا دو

गरमाओ गुलामों का लहु सजें यकीन से
कंजशक फेरुमाया को शाही से लड़ा दो ।

బానిసల నెత్తురును
విశ్వాసపు జ్వాలచే ఉడికించుము.
బలహీనమైన పిచ్చుకను
గరుత్మంతునితో పోరాడించుము.

ہوئی نہ زاغ میں پیدا بلند پروازی
خراب کر گئی شاہین بچہ کو صحبت زاغ

हुई ना ज़ाग़ मे पैदा बुलंद परवाजी
खराब कर गई शाहीं न बच्चे को सोहबते जाग।

కాకిలో పుట్టలేదు
ఎత్తు ఎగిరే శక్తి;
కాకి సహవాసం
గరుడుని పిల్లల పెడమార్గమున పెట్టెను.

پرندوں کی دنیا کا درویش ہوں میں
کہ شاہیں بناتا نہیں آشیانہ

परिंदों की दुनिया का दरवेश हूँ मैं
कि शाही बनाता नहीं आशियाना।

పక్షుల ప్రపంచములో
నేను బైరాగిని
గూడును కట్టుకోడు
గరుత్మంతుడు.

گذر اوقات کر لیتا ہے یہ کوہ و بیاباں میں
کہ شاہیں کیلئے ذلّت ہے کارِ آشیاں بندی

गुज़र औकात कर लेता है यह बाँ मे
कि शाही के लिये ज़िल्लत है कार आशियां बंदी।

ప్రొద్దుగడుపును
కొండల్లో, ఎడారుల్లో
గూటిలో బందికావడం
గరుత్మంతునికి అవమానము.

شکایت ہے مجھے یاروخداوندان مکتب سے
سبق شاہین بچوں کو دے رہے ہیں خاکبازی کا

शिकायत है मुझे यारे खुदावन्दे मकनब से
सबख् शाही बच्चा दे रहे है खाक बाजी का।

విద్యా సంస్థల అధిపతులపై
నా కిదే ఫిర్యాదు[1]
గరుడుని పిల్లలకు నేర్పుతారు
మట్టిలో పొర్లాడే పాఠాలు.

---

(1) షికాయతు.

نگاہ عشق دل زندہ کی تلاش میں ہے،
شکار مردہ سزاوار شاہباز نہیں

निगाहें ईश्ख दिले जिंदा की तलाश में है
शिकारे मुर्दा सजावारे शेहबाज नहीं ।

జీవించియున్న హృదయమునే
ప్రేమదృష్టి వెదకును;
ఉపయుక్తము కాదు
గరుత్మంతునికి చచ్చిన జీవి.

تو شاہیں ہے پرواز ہے کام تیرا
ترے سامنے آسماں اور بھی ہیں

तू शाही है परवाज है काम तेरा।
तेरे रूबरू आसमान और भी है।

నీవు గరుత్మంతుడవు
ఎగురుటయే నీ కర్తవ్యము
నీ సమ్ముఖమ్మున
మిన్నులు ఇంకా ఎన్నో ఉన్నవి.

عمل سے زندگی بنتی ہے جنت بھی جہنم بھی
یہ خاکی اپنی فطرت میں نہ نوری ہے نہ ناری ہے

अमल से ज़िन्दगी बन्ती है जन्नत भी जहन्नुम भी
यह खाकी अपनी फितरत मे ना नूरी है ना नारी है।

ఆచరణచే జీవన నిర్మాణము
స్వర్గమైనా, నరకమైనా.
స్వభావముచే ఈ మట్టిమనిషి
స్వర్గవాసికాడు, నరకవాసికాడు.

پختہ تر ہے گردش پیہم سے جام زندگی
ہے یہی ایک بے خبر راز دوام زندگی

पुलखता तर है गरदिशे पै हम से जाम जिन्दगी
है यही एक बेखबर राजे दवा मे जिन्दगी।

నిరంతర భ్రమణలచే
తయారైనది గట్టి జీవన పాత్ర,
ఈ శాశ్వత రహస్యమును
తెలిసికొనలేకుండుటయే మనందరి
జీవనము.

اپنی دنیا آپ پیدا کر اگر زندوں میں ہے
سر آدم ہے ضمیر کن فکاں ہے زندگی

अपनी दुनिया आप पैदा कर अगर जिन्दों मे है
सर आदमी है ज़मीर कुनफुकां है जिन्दगी।

జీవించియున్న వారిలో ఉంటే
నీ ప్రపంచమును నీవు సృష్టించుకో.
నీ అంతరాత్మ సంకల్పసిద్ధియే జీవనము;
అదే మానవ రహస్యము.

زندگی کی قوت پنہاں کو کردے آشکار
تا یہ چنگاری فروغ جاوداں پیدا کرے

जिन्दगी कछते पिन्हाँ को करदे आश्कार
ता यह चिंगारी फरोग जावाँ पैदा करे।

ప్రకటించు
దాగియున్న జీవన శక్తిని,
నిప్పురవ్వలనుండి
శాశ్వత దీప్తిని పుట్టించు.

تمنّا آبرو کی ہو اگر گلزارِ ہستی میں
تو کانٹوں میں اُلجھ کر زندگی کرنے کی خُو کرلے

तमन्ना आबरू की हो अगर गुलजारे हस्ति मे
तो कांटों मे उलझकर जिन्दगी करने कि खू करले।

పరువు కొరకు కోరిక ఉంటే
ఈ జీవితపు తోటలో
ముళ్ళలో తగుల్కొని
బ్రతకడం అలవాటు చేసికో.

پانی پانی کر گئی مجھ کو قلندر کی یہ بات
تو جھکا جب غیر کے آگے نہ من تیرا نہ تن

पानी पानी कर गई मुझ को कलंदर की यह बात
तू झुका जब गैर के आगे ना मै तेरा ना तन्।

తేట తెల్లము చేసెను
నాకు ఈ మాట కలందరు [1]
పరాయివారి ఎదుట నడుమువంచినపుడు
మనసుగాని తనువుగాఁ నీవి కావు.

(1) సన్యాసి

جوانی ہے تو ذوقِ دید بھی لطفِ تمنّا بھی
ہمارے گھر کی آبادی قیامِ مہماں تک ہے

जवानी है तो जौके दीद भी लुत्फे तमन्ना भी
हमारे घर की आबादी कियाम मेहमाँक तक है।

యౌవనముంటే, చూడవలయునని కుతూహలము
అభిలాషల ఆనందము కూడ.
ఈ అతిథి ఉన్నంతవరకే
మా యింటిలో ఇవి కాపురము.

تراش از تیشه خود جاده خویش
به راه دیگراں رفتن عذاب است

तराण अज तीशे खुद जादे खुवीश
के उब्रराहे दीगरां रफ़तने अजाब अस्त।

మలచుకో నీ సొంత గొడ్డలితో
నీ సొంత దారిని
పరాయి వారి దారిలో పోవడం
దుఃఖముల చేకూర్చును.

کوئی دل ایسا نظر نہ آیا نہ جس میں خوابیدہ ہو تمنّا
الٰہی تیرا جہاں کیا ہے نگار خانہ ہے آرزو کا

कोई दिल ऐसा नजर ना जिसमे खाबीदा हो तमन्ना
इलाही तेरा ज़हाँ क्या है निगार आरज़ू का।

నిద్రాణములైన అభిలాషలు
కోరికలు లేని హృదయము, నా కంట
పడలేదు.

పరమేశ్వరా ! ప్రపంచమును ఒనర్చితివి
వాంఛల ప్రదర్శనశాలగా.

کرمکِ ناداں طوافِ شمع سے آزاد ہو
اپنی فِطرت کے تجلّی زار میں آباد ہو

करमक नादान तवाफे शमा से आज़ाद हो
अपनी फ़ितरत के तज्जल्ली हार मे आबाद हो।

తెలివిలేని శలభము

దీప ప్రదక్షిణములలో స్వాతంత్ర్యమును

పొందెను.

తన స్వభావపు వైభవము

అచటనే విడిది చేసెను.

جو انساں عدم سے آشنا نہیں ہوتا
آنکھ سے غایب تو ہوتا ہے فنا نہیں ہوتا

जो इन्सां अदम से आशना नही होता
आंख से गायब तो होता है फ़ना नही होता ।

శూన్యతతో పరిచయము
లేని మానవుడు
కన్నుమరుగై పోవును,
కాని నాశనము కాదు.

تو ہی ناداں چند کلیوں پر قناعت کر گیا
ورنہ گلشن میں علاج تنگیٔ داماں بھی ہے

तू ही नादां चन्द कलियों पर खिनाअत कर गयां
वरनः गुलशन मे इलाज तंगी दामां भी है।

కొలది మొగ్గలతోనే
తృప్తిపడితివి అజ్ఞానుడా!
లేకున్న తోటలో
చిన్నదైన ఈ కొంగు కూడ విస్తరించ
వచ్చును.

زندگی قطرہ کی سکھلاتی ہے اسرارِ حیات
یہ کبھی گوہر کبھی شبنم کبھی آنسو ہوا

जि़न्दगी ककरे की सिखाती है असरारे हयात
यह कभी गोहर कभी शब्नम आंसू हुआ।

బిందువు జీవిత చరిత్ర;
జీవన రహస్యముల నేర్పును;
కొన్ని వేళల అదే ముత్యము,
హిమబిందువు, అశ్రు బిందువు కూడ.

زندگی انسان کی ہے مانندِ مرغِ خوش نوا
شاخ پر بیٹھا کوئی دم چہچہایا اڑ گیا

ज़िन्दगी इंसान की है मानिन्द मुर्गे ख़ुशनवा
शाख़ पर बैठी कोई दम चहचहाया और उड गया ।

మానవుని జీవితము
కలకూజితముల విహంగము.
కొమ్మపై కూర్చున్నది కొంతసేపు,
పాడింది, ఎగిరిపోయింది.

مرنے والے مرتے ہیں لیکن فنا ہوتے نہیں
یہ حقیقت میں کبھی ہم سے جُدا ہوتے نہیں

मरने वाले मरते हैं लेकिन फ़ना होते नही
यह हकीखत मे कभी हम से जुदा होते नही

మరణించువారు
మరణించుచున్నారు
కాని ఎప్పటికిని వినాశము చెందరు
మనతో వేరుకారు - ఇది నిజము.

آئینۂ ایّام میں آج اپنی ادا دیکھ
اے راکب تقدیر جہاں میری رضا دیکھ

आइनें अय्यम मे आज अपनी अदा देख
ए राकीबे तकदीरे जहाँ मेरे रजा देख ।

కాల దర్పణములో
నేడు నీ సోయగము చూడు!
ప్రపంచ భాగ్య విధాతా!
నా సంతోషము పరికించు!

اٹھا نہ شیشہ گرانِ فرنگ کے احسان
سفالِ ہند سے مینا و جام پیدا کر

उठा न शीशये गिरां फखां के एहसान
सिफ़ाल हिंदी से मीना व जाम पैदा कर।

పాశ్చాత్యుల విలువైన సీసాలు
కృతజ్ఞతతో ఎత్తకు
భారత వర్షపు మట్టితోనే
నీ కూజా పానపాత్ర చేసికో!

افراد کے ہاتھوں میں ہے اقوام کی تقدیر
ہر فرد ہے ملّت کے مقدّر کا ستارہ

अफ़राद हाथों मे है अकवाम की तकदीर।
हर फ़र्द है मिल्लत के मुकद्दर का सितारा।

వ్యక్తుల హస్తములలో కలదు,
రాష్ట్రాల అదృష్టము
ప్రతి వ్యక్తి కావలె
దేశభాగ్యపు నక్షత్రము.

ہو اگر خود نگر و خود گر و خودگیر خودی
یہ بھی ممکن ہے کہ تو موت سے بھی مر نہ سکے

हो अगर खुद नगर व खुद गर व खुदगीरे खुदी
यह भी मुमकिन है कि तू मौत से भी मर न सके ।

తన్ను చూచుకొని
తన్ను నిర్మించుకొని
తన్ను ఆత్మలో పరివేష్టించుకొన్నచో,
చావుతోను చావకుండుట సాధ్యము.

وہی ہے صاحبِ ہمّت جس نے اپنی ہمّت سے
زمانے کے سمندر سے نکالا گوہرِ فردا !

वही है साहिबे हिम्मत जिसने अपनी हिम्मत से
जमाने के समंदर से निकाला गोहरे फरदा ।

ఎవడు తన సాహసముతో
కాల జలధి నుండి
రేపు అను ముత్యమును పైకి తెచ్చునో
అతడే సాహసవంతుడు.

بھروسہ کر نہیں سکتے غلاموں کی بصیرت پر
کہ دنیا میں فقط مردانِ حر کی آنکھ ہے بینا

भरोसा कर नही सकते गुलामो की बसीरत पर
कि दुनिया में फ़क़त मर्दाने हुर की आंख है बीना ।

బానిసల దూరదృష్టిపై
విశ్వాసముంచలేము.
ప్రపంచములో స్వతంత్రమానవుల
కన్నులకే కలదు చూపు.

بندہ آزاد را شان دگر
مرگ آدمی دہد جانے دگر

बंदये आजाद राशने दिगर
मर्ग आदमी दहद जाने दिगर ।

విముక్తులగు భక్తుల
ఉన్నతి వేరు,
వారి మరణము ఇచ్చును
ఇతరులకు ప్రాణము.

محکوم کو پیروں کی کرامات کا

ہے بندۂ آزاد خود اک زندہ کرا

कुम को पीरों की करामात का सौदा

बंदये आजाद खुद एक जिंद: करामात

వుల అద్భుతాలు బానిసలను ఆకర్షించును

విముక్త భక్తుడు స్వయముగ

ఒక సజీవ అద్భుతము

دل زسوز آرزو گیرد حیات
غیر حق میرد چو او گیرد حیات

दिल ज़ सूज आरजह . गीरद हयात
गैर हकं यीर व चो गीरदं हयात ।

వాంఛల వేడిమిచే హృదయము
జీవితమునే పట్టివేయును,
దుష్టమైన వాంఛలతో మరణించును
పట్టుబడ్డిన జీవితము.

آرزو جاں جہاں رنگ و بو است
فطرت ہر شے میں آرزو است

आर्जु जाने जहाँ रंग व बू अस्त
फ़ितरते हर शै मे आर्जून अस्त।

సుగంధ సువర్ణముల ప్రపంచమునకే
ప్రాణము వాంఛ.
ప్రతిజీవి స్వభావములో
ప్రదర్శిత బడ్డది వాంఛ.

شیوۂ تہذیب نو آدم دری است
پردۂ آدم دری سوداگری است ۔

शैवये तहज़ीब नो आदम दरि अस्त
पर्दये आदम दरी सौदागरी अस्त ।

నవసభ్యత నీతి
మానవుని హింసించడం
మానవుని హింస తెర వెనుక
సాగుతుంది వ్యాపారము.

جلال بادشاہ ہو کہ جمہوری تماشہ ہو
جدا ہو دیں سیاست سے تو رہ جاتی ہے چنگیزی

जलाले बादशोह हो कि जमूहरी तमाशा हो
जुदा हो वें सियाशत से तो रह जाती है चंगेजी ।

పాదుషాల వైభవము కానీ
ప్రజాస్వామ్యపు తమాషా కానీ,
రాజకీయాలనుండి ధర్మము వేరైతే
అత్యాచారము అధిక మగును.

خدا کے عاشق تو ہیں ہزاروں بتوں میں پھرتے ہیں مارے
میں اس کا بندہ بنوں گا جس کو خدا کے بندوں سے پیار ہوگا

खुदा के आशिक तो हैं हजारों बुतों फिरते हैं मारे
मैं उसका बंद बनूंगा जिसको खुदा के बंदों से प्यार होगा ।

వేలకొలది భగవంతుని ప్రేమికులు కలరు;
అడవులలో తిరుగుచు వేసారువారు;
దేవుని దాసుల ప్రేమించువారి
దాసుడను అయ్యెదను నేను.

محبّت ہی سے پائی ہے شفا بیمار قوموں نے
کیا ہے اپنے بخت خفتہ کو بیدار قوموں نے

मुहब्बत हि से पाई है शिफा बीमार कौमो न
किया है अपने ब़खत ख़फ़ता का बेदार कौमो ने ।

సౌహార్ద్రతతోనే ఆరోగ్యమును పొందెను
రోగగ్రస్తములగు రాష్ట్రములు
దానితోనే తమ నిద్రిత, అదృష్టములను
మేల్కొల్పినవి రాష్ట్రములు.

ستاروں سے آگے جہاں اور بھی ہیں
ابھی عشق کے امتحاں اور بھی ہیں

सितारो से आगे जहाँ और भी हैं
अभी इशख के ईमतहाँ और भी हैं।

తారలకు పైన ప్రపంచాలు
ఇంకా ఎన్నో ఉన్నవి.
ఇప్పటికీ ప్రేమపరీక్షలు
ఇంకా ఎన్నో ఉన్నవి.

تہی زندگی سے نہیں یہ فضائیں
یہاں سینکڑوں کارواں اور بھی ہیں

तरी जिन्दगी से नही यह फिजायें
यहाँ सैकडों कारवाँ और भी है।

ప్రాణము లేక
ఈ వాతావరణము లేదు;
నూర్ల కొలది బాటసారుల జుట్లులు
ఇక్కడ ఇంకా ఎన్నో ఉన్నవి.

قناعت نہ کر عالم رنگ و بو پر
چمن اور بھی آشیاں اور بھی ہیں

किनाअत न कर आलमे रंग व बू पर
चमन और भी आशियां और भी हैं।

తృప్తి చెందకు
వర్ణ సుగంధముల ప్రపంచముతో;
నందనవనములు యోగ్యములైన నీరములు
ఇంకా ఎన్నో ఉన్నవి.

اگر کھو گیا اک نشیمن تو کیا غم
مقاماتِ آہ و فغاں اور بھی ہیں

अगर खो गया एक नशेमन तो क्या गम
मुक़ामाम आह व फुगाँ और भी हैं।

ఒక్క గూడు పోగానే
ఎందులకు ఇంతచింత ?
నిట్టూర్పులకు ఏడ్పులకు చోట్లు
ఇంకా ఎన్నో ఉన్నవి.

تو شاہیں ہے پرواز ہے کام تیرا
ترے سامنے آسماں اور بھی ہیں

तू शाही है परवाज है काम तेरा
तेरे सामने आस्मान और भी हैं।

నీవు పక్షి రాజువు,
ఎగురుటయే నీ పని;
నీ యెదుట మిన్నులు
ఇంకా ఎన్నో ఉన్నవి.

اسی روز و شب میں اُلجھ کر نہ رہ جا
کہ تیرے زماں اور مکاں اور بھی ہیں

इसीं रोज व शब मे उलझ कर न रह जा
कि तेरे जमा और मकाँ और भी हैं।

ఈ దినయామినులలో
చిక్కుకొని ఉండిపోకు;
నీ అవకాశాలు, ప్రదేశాలు
ఇంకా ఎన్నో ఉన్నవి.

گئے دن کہ تنہا تھا میں انجمن میں
یہاں اب مرے رازداں اور بھی ہیں

गये दिन कि तनहा था मै अन्जुमन में
यहाँ मेरे राजदां और भी हैं।

గతకాలములో గోష్ఠిలో
నేను ఒంటరిగా ఉంటిని:
ఇప్పుడు, ఇచ్చట నా విషయముల నెరిగినవారు
ఇంకా ఎంతో మంది కలరు.

نہ تو زمیں کے لیے نہ آسماں کے لیے
جہاں ہے ترے لیے تو نہیں جہاں کیلئے

न: तू जमी के लिये न तू आस्माँ के लिये
जहाँ है तेरे लिये तू नही जहाँ के लिये ।

నీవు ఆకసము కొరకు కాదు,
భూమి కొరకు కాదు,
ప్రపంచము నీ కొరకై ఉన్నది.
నీవు ప్రపంచము కొరకు కాదు.

ہیں ترے تصرّف میں یہ بادل یہ گھٹائیں
یہ گنبدِ افلاک یہ خاموش فضائیں

हैं तेरे तसर्रुफ़ मे यह बादल यह घटायें
यह गुंबदे अफ़लाक यह खामूश फ़िज़ाफे।

ఉన్నవి నీ ఆధీనములో
ఈ మేఘాలు, వర్షపాతాలు;
ఈ గుండ్రముగా ఉన్న ఆకసము,
మౌనముగా నున్న వాతావరణము.

یہ کوہ یہ صحرا یہ سمندر یہ ہوائیں
تھیں پیش نظر کل تک تو فرشتوں کی ادائیں

यह कोह व सहरा यह समंदर यह हवाफ़
थी पेश नजर कल तो फ़रिशता को अदाऐं।

ఈ కొండలు, ఎడారులు,
సముద్రాలు, పవనాలు,
నిన్నటివరకు గంధర్వుల వినోదాలకై
వారి ఎదురుగా ఉండేవి.

وہی جہاں ہے تیرا جس کو تو کرے پیدا
یہ سنگ و خشت نہیں جو تری نگاہ میں ہے

वही जहाँ है तेरा जिसको तू करे पैदा
यह संगे विशत नही तेरी निगाह मे है।

నీవు నిర్మించే ప్రపంచమే నీది
నీకు కాన్పించే రాళ్ళ ఇటుకల ప్రపంచం
కాదు.

# ఆత్మావిష్కారము

డా॥ దాశరథి

బహుముఖ ప్రజ్ఞాశాలురైన మహాకవులలో ఇక్బాల్ ఒకడు. ఆయన భారతదేశ కవి మాత్రమే కాదు. ఆయనను ప్రాక్ ప్రపంచ కవి అనడం సబబనుకుంటాను. శతాబ్దాలుగా దాస్యాంధకారంలో మగ్గియున్న ప్రాక్ ప్రపంచాన్ని చూచి ఆయన చాలా వేదన పడ్డాడు. పాశ్చాత్యులు ప్రాక్ ప్రపంచాన్ని అంతటినీ బానిస శృంఖలాలతో బంధించారు శతాబ్దాలపాటు.

ఈ తూర్పులో ఎప్పుడు తెల్లవారుతుంది? ఎప్పుడు స్వాతంత్ర్య భానూదయం జరుగుతుంది?అని వెతజెందినవాడు ఇక్బాల్. మహమ్మదీయుల దేశమని, బౌద్ధుల దేశమని, హిందువుల దేశమని కాకుండా తూర్పులోని దేశాలు చాలావరకు తమ వ్యక్తిత్వాన్ని కోల్పోయి పాశ్చాత్యులకు తలయొగ్గిన స్థితినిచూసి ఎంతో వేదన పడిన ఇక్బాల్ లేఖినిలోనుంచి వెలువడిన కవితలు చిరస్మరణీయాలు.

"విప్లవం లేని జీవితం మృత్యువుతో సమానం" అన్నాడు ఇక్బాల్. అతని ప్రఖ్యాతరచన "బాలె జిబ్రయీల్"లోని "దేవతలకు భగవంతుని ఆదేశం" అన్న కవితలో ఆయన వ్యక్తపరచిన విప్లవాత్మక భావాలను అవగతం చేసుకొని, ఇక్బాల్‌ను మించిన విప్లవకవి లేడు అనుకున్నాను నా చిన్నతనంలో.

"పేదలకు తిండిపెట్టలేని పొలాలను తగలపెట్టండి. మేల్కోండి పేదలారా! ధనికుల మేడలు పడగొట్టండి. బానిసల రక్తాన్ని

పొంగించండి. ప్రజాస్వామ్యయుగం వస్తున్నది" అని ఎలుగెత్తి చాటాడు ఇక్బాల్.

అయితే ఈ విప్లవ నినాదాలను మించిన గంభీరమైన తాత్త్విక భావన ఆయన కవితలో ఉన్నదని అర్థంచేసుకోడానికి ఆయన ఇతర రచనలు"అర్ముగానె హిజాజ్" "జర్బెకలీమ్""బాలె జిబ్రయీల్" లోని ఆత్మావిష్కారఘట్టను చదవాలి.

"కళ్ళుతెరువు; భూమిని చూడు;
ఆకాశాన్ని తిలకించు; ప్రకృతిని దర్శించు,
తూర్పునుంచి ఉబికివస్తున్న సూర్యుణ్ణి కాస్తచూడు"

అంటూ విశ్వాత్మ, మానవుని ఆహ్వానిస్తున్న ఘట్టంలో (బాలె జిబ్రయీల్) ఇక్బాల్ ఆశావాది అని రూఢి అవుతుంది. అతని విశాలహృదయం గురించి చెప్పాలంటే, ఆయన భారతీయ, మహమ్మదీయ, బౌద్ధ, పాశ్చాత్య సిద్ధాంతాలను సహృదయతతో ఆకళించుకుని తనకు నచ్చిన వాటినన్నిటినీ జీర్ణించుకున్నాడు. భగవద్గీతలో కృష్ణ భగవానుని కర్మసిద్ధాంతం, బుద్ధుని కారుణ్యభావం, భర్తృహరిలోని నీతి, వైరాగ్యాలు ఆకళించుకున్నాడు.

"ఆచరణే జీవితం" అన్న ఇక్బాల్‌మాట భర్తృహరి భావనే. ఆచరణ ఉత్తమమైనదైతే, జీవితగమ్యం చేరుకోగలం. అలా కానప్పుడు మానవుడు విఫలుడౌతాడు, అన్నాడు ఇక్బాల్ ఒకచోట.

అన్నిటికంటె ఇక్బాల్ రచనలలో నన్ను ఆకర్షించింది "ఖుదీ" (ఆత్మ). మానవుని ఆత్మమీద ఇక్బాల్‌కు చాలా విశ్వాసం వుంది. "ఆత్మే జీవం; ఆత్మను కోల్పోవడమే మృత్యువు" అంటాడు ఇక్బాల్ ఒకచోట.

డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇక్బాల్ రచనల అనువాదానికీ, ముఖ్యంగా ఇక్బాల్ ఆత్మతత్వ ప్రబోధకమైన రచనల అను

కి  పూనుకోవడం నాకు ఎక్కువ ఆనందాన్నీ, తృప్తినీ ంది.

నిజానికి 'ఖుదీ' అన్నమాటకు శబ్దార్థం వ్యక్తిత్వం. కాని , దాన్ని "ఆత్మ" అనే అర్థంలోనే వాడాడు. గోపాలరెడ్డి ఖుదీ' అన్నచోటల్లా 'ఆత్మ' అన్నపదం వాడడం ఎంతో పంగా వుందని నేను భావిస్తున్నాను.

"ఆత్మచచ్చిపోతే గాలిఎదుట
గడ్డిపోచవలె నుందువు;
ఆత్మ బ్రతికియుంటే
నీవు చరాచరముల ఏలు చక్రవర్తివి"

ఈపంక్తులు చాలు,ఇక్బాల్ కు ఆత్మపైన ఎంతటి మమకారం, ంవున్నదో చెప్పడానికి. ఎవరో వ్యక్తిని ఉద్దేశించి చెప్పి ా అనిపించినా, నిజానికి ఇక్బాల్ తన జాతిని, తన బానిస ఎ, దాస్యంలో మగ్గివున్న ప్రాక్ప్రపంచాన్ని అంతనీ అతను చి ఈ వాక్యాలు అన్నాడని నేను భావిస్తున్నాను. ఆత్మ, ప్రపంచానికి జీవం.

"ఆత్మచావగా
తూర్పునాడుల మాగాణములలో
దైవ రహస్యముల ఎరిగినవారు
ఎవరును పుట్టలేదు"

మహమ్మదీయ దేశాలేకాదు, తూర్పుసాంతం ఆత్మ తేజోమయ ఆయన విశ్వాసం.

"ఆత్మ బ్రతికియుంటే
దరిద్రుడే మహారాజు

లేకున్న, మహారాజే
దరిద్రునికన్న హీనుడు" —

శ్రీ గోపాలరెడ్డిగారు, జటిలమైన ఇక్బాల్ ఆత్మతత్వాన్ని చిన్నమాటలలో పాఠకులకు సుబోధకంగా అనువదించా రనడానికి పై పంక్తులు తార్కాణాలు.

ఇక్బాల్ నిర్వచించే ఆత్మ, తొలిమజిలీలో భౌతికమే. కాని క్రమక్రమంగా ఉన్నతిపొంది భౌతిక శక్తులను లొంగదీసుకుని భగవత్ సాక్షాత్కారమును పొందుతుంది.

"దేవుని చూచు భక్తుడు
ఆత్మ జాగృతము కాగా
వాడిగల, కాంతిగల
ఖడ్గమువలె అగును"

అన్న పంక్తులలో ఆత్మశక్తి ఆవిష్కృతము. ఆత్మశకి కల జాతికి ఆయుధాలతో పనిలేదని ఇక్బాల్ ఒకచోట అంటాడు.

"ఆ దేశమునకు
ఆయుధములతో పనిలేదు
ఏ దేశ యువకుల ఆత్మ
ఉక్కువలె గట్టిఅగునో"

ఆత్మ అంటే ఏమిటో, పండు ఒలిచి చేతిలో పెట్టినట్లు చెప్పిన పద్యాలుకూడా ఇక్బాల్ రచనలలో ఉన్నవి. ఉదాహరణకు :-

"నీ జీవితము ముత్యపు చిప్ప,
వర్ష బిందువు ఆత్మ;
అది ఎట్టి శుక్తి
వర్ష బిందువును ముత్యము చేయలేనిది?''

వర్ష బిందువును ముత్యం చేయలేని శుక్తి, శుక్తి అనిపించుకోడానికి యోగ్యముకాదు. అట్లాగే ఆత్మావిష్కారము చేసికొనలేని జీవితము జీవితమే కాదు.

మరోచోట అంటాడు
"జీవితసారము ప్రేమ;
ప్రేమసారము ఆత్మ'' అని.

ప్రేమవలన ఆత్మ పరిపక్వ మవుతుంది.

"దేవుణ్ణి చూడాలనుకుంటే నీ ఆత్మ లోతులను చూడు" అంటాడు ఒకచోట ఇక్బాల్. మానవుణ్ణి సంపూర్ణ మానవునిగా రూపొందించడానికీ, భగవంతునితో ఏకత్వం సాధించడానికీ ఆత్మయే ఉత్తమ సాధనం.

"విద్యా ద్రావకములో
నానవేయుము నీ ఆత్మను;
మెత్తనకాగా వినియోగించు
ఎక్కడ వలసిన అక్కడ"

విద్యాద్రావకంలో ఆత్మను నానవేయడం అనే భావం మూలంలో వుంది. మూలంలోని సొగసును యథాతథంగా మనకు తెలియ జేయడంలో గోపాలరెడ్డి గారు విజయం సాధించారు.

ఉత్తమ అనువాదం, మూలానికి విధేయంగా వుండాలి. అనుసరణ, అనుకరణ, పునస్సృష్టి కారాదు. అనుసరణలో మూల సౌందర్యం నశిస్తుంది. ఫారసీలో ప్రేయసీప్రియుల ప్రణయాన్ని దీప, శలభ ప్రణయంతో ఉపమింప జేస్తారు కవులు. అనువదించినపుడు మల్లి కా భ్రమర ప్రణయంగా చెబితే, మూలంలోని కొత్తదనం పాఠకుడికి అర్థంకాదు. అందుకని గోపాలరెడ్డిగారి ఈ అనువాదం, ఇక్బాల్ కవితలోని వింత అలంకారాలను, నుడికారాలను, భావప్రకటనా రీతిని మనకు అద్దంపట్టి చూపుతుంది. ఇదొక గొప్ప విశేషం.

విద్యాద్రావకంలో ఆత్మను నానవేయడం వంటి చక్కని భావనలను, మూలం చదవలేని తెలుగు పాఠకునికి అందించిన గోపాలరెడ్డిగారి అనువాదరీతిని అభినందిస్తున్నాను.

గోపాలరెడ్డిగారు ఇక్బాల్ యొక్క కొన్ని ఫారసీ పద్యాలను కూడా అనువదించారు. నాటిలో నాకు నచ్చిన ఒక పద్యాన్ని ఇక్కడ ఉదహరిస్తున్నాను.

"మానవుని అన్వేషించడములో
ముందడుగు వేయుము.
దేవుడు కూడ
మనిషిని వెదకుచునే ఉన్నాడు"

దేవుడు మనిషిని వెదకుతూ వుండడాన్ని ఊహించడం ఇక్బాల్ కవితకు పరాకాష్ఠ.

గోపాలరెడ్డిగారు 'ఖుదీ'ని వ్యక్తిత్వమనే సాధారణ పదంతో సరిపెట్టక 'ఆత్మ' అనే మాటవాడి నిండుదనం తెచ్చినట్లే—

"షాహీన్' అనే పదానికి "డేగ" అనే నైఘంటుకార్థంతో సరి పెట్టక, గరుత్మంతుడుగా అనువదించడం నాకు ఎంతో సొగసని పించింది.

"నీవు గరుత్మంతుడవు
పర్వత శిఖరాలలో కాపురముచేయి"
("తూ షాహీఁహై బసేరా కర్ పహాడోఁకీ చటానోఁపర్")

ఇందులో షాహీఁను డేగగా అనువదిస్తే, ఈ గాంభీర్యం వచ్చేదేకాదు.

"గూడును కట్టుకోడు గరుత్మంతుడు"
(కె షాహీఁ బనాతా నహీఁ ఆషియానా)

సాధారణ పక్షులు గూళ్ళు కట్టుకుంటాయి. గరుత్మంతుడు పక్షిరాజు. గూడు కట్టుకుంటాడా?

"పక్షుల ప్రపంచంలో నేను బైరాగిని'' అన్నారు. బైరాగికి ఇల్లులేదు: కాని స్వేచ్ఛ వుంది. అదే ఉపాదేయం.

"నీవు గరుత్మంతుడవు;
ఎగురుటయే నీ కర్తవ్యము,
నీ సమ్ముఖమున
మిన్నులు ఇంకా ఎన్నో ఉన్నవి"

ఎంత చక్కని కవిత! స్వేచ్ఛా జీవియైన మానవుని గరుత్మంతునిగా భావించినాడు కవి.

"ఖుదీ", ''షాహీన్'' తో పాటు గోపాలరెడ్డిగారు మరి కొన్ని ఇక్బాల్ కవితలు అనువదించారు. వానిలో జావేద్‌నామా,

కొత్త శివాలయము, మిణుగురు పురుగులు, రాత్రి-కవి, గాలిబ్‌పై ఇక్బాల్ వ్రాసిన గీతము, చాలా గొప్పవి.

గాలిబ్‌ను గురించి వ్రాస్తూ :—

"కల్పనా విహంగపు పక్షములు
ఎంతో దూరము చేరగలవు;
నఖశిఖ పర్యంతము నీవు ఆత్మవు;
సాహిత్య సభలు నీ శరీరము" అన్నాడు ఇక్బాల్.

ఈ పంక్తులు చదువుతున్నపుడు నా నయనాంచలములలో అశ్రుకణములు తొణికినవి.

"ఉర్దూ కుంతలములకు
ఇంకను నీ దువ్వెన అవశ్యమై యున్నది"

అంటాడు ఇక్బాల్, గాలిబ్‌ను గూర్చి. ఎంత నూతన భావన!

ఇక్బాల్ ను సరసమైన, సరళమైన, తెలుగులో మూలవిధేయముగా అనువదించిన గౌరవం డా॥ బెజవాడ గోపాల రెడ్డి గారికే దక్కింది. తెలుగు పాఠకలోకానికి ఇక్బాల్ కవితా సౌరభాలను అందించిన గోపాలరెడ్డిగారిని అభినందిస్తున్నాను.

ఈ అనువాదాన్ని సర్వాంగ సుందరంగా ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీకి నా ధన్యవాదములు.

"ఆత్మ బ్రతికి యుంటే
అపార సాగరాలు నడకతోనే దాటవచ్చు;
ఆత్మ బ్రతికి యుంటే
కొండ వరుసలు మఖ్‌మల్ వలె మెత్తన"

—: o :—

حیدرآباد، دہلی اور لکھنؤ میں ڈاکٹر گوپال ریڈی نے اردو پر اس
عبور حاصل کر لیا کہ وہ اب اس زبان کے خادم اور محسن دونوں حیثیت کے
ہیں اقبال صدی تقاریب کے اس سال ڈاکٹر صاحب نے اقبال کے سو منتخب اش
تلگو ترجمہ کیا ہے۔ زیر نظر کتاب میں یہ ترجمہ ہندی رسم الخط میں بھی شائع کیا ج
اقبال صدی تقاریب میں ساری دنیا میں لٹریچر مرتب ہو رہا ہے۔ یقیناً ڈاکٹر ص
کا یہ مجموعہ تلگو زبان کی جانب سے ایک قابل قدر نذرانہ ہے۔ ڈاکٹر صاحب
اردو اور تلگو زبان میں ربط و اشتراک کے لئے جو کام انجام دیئے ہیں بلا ش
مستقبل کے لئے ایک اہم تعمیری بنیاد ہیں۔

ڈاکٹر گوپال ریڈی صاحب کی اس اہم علمی تصنیف کے لئے یہ چند مختصر ا
لکھتے ہوئے میں فخر محسوس کرتا ہوں کیونکہ ڈاکٹر صاحب کا یہ کام ہمارے ا
علاقے کی قدیم مشترکہ روایات اور زبانوں کے اس سنگم کا ایک عملی ثبوت ہے


رکن ساہتیہ اکیڈیمی
(شعبہ اردو)


۲۵ جنوری ۱۹۷۷ء


**عابد علی خاں**
اڈیٹر روزنامہ سیاست

# تعارف

ہمارے ملک میں مختلف زبانوں کا جو مقام اور رشتہ ہونا چاہیئے اس سلسلہ میں جن ممتاز شخصیتوں نے اہم و عہد ساز علمی و عملی کام انجام دیئے ہیں ان میں ڈاکٹر بی گوپال ریڈی کا نام سرفہرست رہے گا۔ آندھرا پردیش کی تشکیل کے بعد ڈاکٹر بی گوپال ریڈی نے اس ریاست کی ایک اہم زبان اردو کو نہ صرف سیکھا بلکہ اس کی ترقی میں بھی اہم حصہ لیا۔ ڈاکٹر گوپال ریڈی نے چیف منسٹر آندھرا کی حیثیت سے سابق ریاست حیدرآباد کی تقسیم سے قبل ہی انجمن ترقی اردو کے اردو ہال کی تعمیر کے لئے گرانقدر عطیہ دیا تھا۔ جب وہ مرکزی وزیر مقرر ہوئے تو انہوں نے انجمن ترقی اردو کو مرکزی حکومت سے بھی کثیر رقم دلائی۔

آندھرا پردیش کی تشکیل کے بعد جب ڈاکٹر گوپال ریڈی حیدرآباد تشریف لائے تو انہوں نے نہ صرف اردو سیکھی بلکہ غالب کے کلام پر کام بھی کیا۔ انہیں اردو شعر و ادب سے بڑا گہرا لگاؤ ہے۔ یہی وجہ ہے کہ ڈاکٹر صاحب کو ہر بڑے اردو مشاعرہ میں مدعو کیا جاتا رہا۔

ڈاکٹر گوپال ریڈی نے اترپردیش کی گورنری کے زمانے میں اردو پر عبور حاصل کیا اور وہاں کی اردو تحریکات کی سرپرستی کی۔ آج اگر اترپردیش میں اردو کے لئے بہتر حالات پیدا ہوئے ہیں تو اس کے لئے ڈاکٹر گوپال ریڈی کے ان دنوں کے ابتدائی کام کو نظرانداز نہیں کیا جاسکتا۔ لکھنؤ کے راج بھون میں محترمہ سروجنی نائیڈو صاحبہ کے بعد ڈاکٹر گوپال ریڈی نے اردو شعر و ادب کی سرپرستی کا اعادہ اور احیا کیا۔



Dedicated

to

My friend and well wisher

LATE DOSTH MOHAMMED ALLADIN

( Born 31-5-1909 Expired 13-1-1973 )

a large hearted, philanthropist

and

a prominent Industrialist of Hyderabad.

# اقبال کے سو شعر

تلگو ترجمہ




ڈاکٹر بجواڑہ گوپال ریڈی

آندھراپردیش ساہتیہ اکیڈیمی
حیدرآباد - ۴

قیمت: ٦ روپیئے
Price : Rs. 6/-
مطبوعہ سیاست آفسٹ پریس